


**10**

ప్రమోద శరత్తు

AUTUMN 1990



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్ సుందరం




# చైతన్యకవిత

**10**

ప్రమోద శరత్తు ✻ AUTUMN 1990

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్ సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
October, 1990, pp. viii + 56.

ముఖచిత్రం : శ్రీ మధునాపంతుల
శ్రీ ఇస్మాయిల్

వెనుకవైపు : పద్మభూషణ శ్రీ జాషువ
తెనుఁగులెంక శ్రీ తుమ్మల

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

10-00 (ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00;
జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

Prof. T. V. Subba Rao
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

Prof. R. V. S. Sundaram
Telugu University
Rajahmundry Campus
Bommur-533 124 (Andhra Pradesh)

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# ప్రమోద శరత్తు

ఈ సంచికతో చైతన్య కవితా వేదిక పది పుస్తకాలను ప్రచురించి నట్లయింది. ఐదు సంవత్సరాలలో పది కవితా సంకలనాలను ప్రచురించడం ఎంత కష్టసాధ్యమో సహృదయులకు తెలియనిది కాదు. దీనికి మిత్రులు, శ్రేయోభిలాషులు ఇచ్చిన ప్రోత్సాహమే ముఖ్య కారణం. కవులు, సహృదయులు, సాహిత్యాసక్తులు ఇతోధిక సహకారం అందిస్తారని ఆశిస్తున్నాము.

ఇటీవల పుట్టపర్తి, ఉషశ్రీ, బీనాదేవి వంటి సాహితీ వేత్తలను కోల్పోవడం తెలుగు సాహిత్యరంగానికి తీరని లోటు. ఆ మహనీయులకు మా శ్రద్ధాంజలి అర్పించుకుంటున్నాము.

ఈ సంచిక వెలువడడానికి అన్ని విధాల సహాయ సహకారాలనందించిన మిత్రుల కందరికీ వందనాలు.

సంపాదకులు

# ఈ సారి వేదికవలకరింప వారు

## అనువాద కవిత

'పద్మభూషణ', 'కళాప్రపూర్ణ', 'కవికోకిల' శ్రీ గుఱ్ఱం జాషువ (1895-1971) గుంటూరు జిల్లా వినుకొండలో జన్మించారు. 25 పైగా ఖండకావ్యాలను రచించారు. నవయుగ కవి చక్రవర్తిగా పేరుగాంచారు వారి రచనలలో కొన్ని :

కావ్యాలు : పిరదౌసి, ముంతాజ్ మహల్, స్వప్న కథ, అనాథ, గబ్బిలము, కాంది శీకుడు, నేతాజీ, బాపూజీ, స్వయంవరం, రాష్ట్రపూజ, కొత్తలోకము, క్రీస్తుచరిత్ర

ఖండకావ్యాలు (ఏడు భాగాలు)

నా కథ (మూడు భాగాలు)

పెద్ద కథ : చిన్నా నాయకుడు

నాటకాలు : ధ్రువవిజయం, హిమదమార్క పరిణయం, చిదానంద ప్రభాతం, రుక్మిణీ కళ్యాణం, మీరాబాయి, తెరచాటు.

* * *

'తెనుగుతెంక', 'అభినవ తిక్కన' శ్రీ తుమ్మల సీతారామమూర్తి (1901-1990) అప్పికట్లలో జన్మించారు. తెలుగులో సంస్కృతంలో రచనలు చేశారు. తెనుగులెంక కృతులు :

ఆత్మార్పణము, పరిగపంట, ఆత్మకథ (గాంధీ జీవిత చరిత్ర), శబల, సర్వోదయగానము, రాష్ట్రగానము, ఉదయగానము, నేను, నా కథలు, ఎక్కట్లు, సందేశ సప్తశతి మొదలైనవి.

* * *

'కళాప్రపూర్ణ' శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి కోనసీమలోని పోలవరంలో 5-3-1920 తేది జన్మించారు. ఇంజరం సంస్కృత పాఠశాలలో

శ్రీ మహేంద్రవాడ సుబ్బారాయ శాస్త్రిగారి వద్ద కావ్యాలంకారాలు, వ్యాకరణ శాస్త్రం అధ్యయనం చేశారు.

'అధునాతనాంధ్ర సారస్వతమున నీ ఆంధ్ర పురాణములో మరియొక మహాగ్రంథ ముదయించినదని చెప్పవచ్చును' అని విశ్వనాథవారిచే ప్రశంస లందుకున్న ఆంధ్ర పురాణ రచనవల్ల మహాకవిగా పేరొందిన మధునా పంతులవారు రచించిన కొన్ని కృతులు :

తోరణము, షడ్దర్శన సంగ్రహము, ధన్వంతరి చరిత్ర, రత్నావళి ఆంధ్ర రచయితలు, బోధివృక్షము, ఆంధ్ర పురాణము, కళ్యాణతార, స్వప్న వాసవదత్త, తెలుగులో రామాయణాలు, చైత్రరథము మొ॥వి.

ఆంధ్ర పురాణమునుండి :

తెలుఁగు చరిత్రలో, రసముఁదేటిచి చూచితి మేని, జీవ నా
డుల నుబికించి, ధైర్యపు ముడుల్ బిగియించి, బలమ్ముఁ బెంచియాం
ధ్రుల మని పించి, ముందడుగుత్రో సెడి శక్తులు, కాకతీశునం
దలవడ్డియా శతాబ్దపు మహత్త్వ కనుంగవ నొత్తియాడదే.

—కాకతీయ పర్వము

ఆంధ్రకవి సార్వభౌమ హేమాభిషేక
పరమసమ్మాన మంగళాచరణ గాన
వాద్య నిస్వాన మది యొక్క స్వాతివాన
తనుపుగా మొగ్గవిచ్చె ముత్యాలశాల

—విద్యానగర పర్వము

మద్రాసు : 7-11-1992 (శనివారం)

# ఇస్మాయిల్-ఒక పరామర్శ

—డా. ముదిగొండ వీరభద్రయ్య

ఇటీవలే అరవయ్యేళ్లు నిండిన కవి ఇస్మాయిల్. మహాకావ్యాలు రాయకున్నా మహాకవితల్ని రాసిన సత్కవి ఇస్మాయిల్. అనాడు తెలుగు సాహిత్యంలో దేవులపల్లి ఎంతో, ఈనాడు తెలుగు సాహిత్యంలో ఇస్మాయిల్ అంత. దేవులపల్లి పద్యాల్లో గేయాల్లో రాస్తే ఇస్మాయిల్ వచనంలో రాసి ఒప్పిస్తున్నాడు. ఇస్మాయిల్ తెలుగు కవిత్వంలో తనదైన విశిష్ట మార్గాన్ని వేసికోవడమే కాకుండా అనేకులపై కవిగా ప్రభావాన్ని కూడా వేస్తున్న కవి.

అనుభూతి కవిత్వ మార్గానికి ఊపిరి పోసి దాన్ని బలంగా రాస్తుండడమే కాకుండా, ఎవరి సాయమూ అక్కర లేకుండానే కవితావీధుల్లో నాయకత్వం వహించగల్గుతున్న కవి ఇస్మాయిల్.

చెట్టు ఇస్మాయిల్ అని ముద్దుగా, సార్థకంగా పిలువబడుతున్న ఈ కవి తన కవితల్లో 'చెట్టు'ను అనేక మార్లు, అనేకార్థాల్లో భావచిత్రంగా గీచారు! వాటిల్లో 'చిలుకలు వాలిన చెట్టు' అన్న కవిత మకుటాయమానమైంది. భావ చిత్రాల రచనలో సిద్ధహస్తులైన ముగ్గురు నలుగురు ఆధునిక తెలుగు కవులలో ఇస్మాయిల్ అగ్రశ్రేణి వాడు. శ్రీశ్రీగారి 'కవితా ఓ కవితా' గేయంలాగా, దేవులపల్లి వారి 'ఆకులో ఆకునై' అన్న కవితలాగా, తిలక్‌గారి ఆర్తగీతం లాగా, ఇస్మాయిల్‌గారి చిలుకలువాలిన చెట్టు విశిష్టమైన కవిత, కవిత్వం ఇది. అమాయికంగా అగుపించే ఈ కవితలో మహార్థాన్ని ఇమిడించిన మహాకవి ఇస్మాయిల్.

ఇస్మాయిల్ రాసిన ప్రతీ కవితలోనూ ఈ అమాయికత కనిపిస్తుంది. ఏమీ లేనట్లే చాలా simpleగా అనిపిస్తుంది. తరచి తరచి చూస్తే ఆ కవితల లోతులు అంది అవి పాఠకులను దిగ్భ్రాంతిలో ముంచుతవి. ప్రీతిష్ నంది వంటి 'బాల' కవులే ఇవాళ అంతర్జాతీయ స్థాయిలో ఉండగా, ఇస్మాయిల్ వంటి వాళ్లు కేవలం తెలుగులోనే రాయడంచేత తెలుగుదేశపు

నాలుగ్గోడల మధ్యనే నిల్చిపోవడం మన దౌర్భాగ్యం. ఆంగ్లంలోకి తప్పక తర్జుమా అయి తీరవలసిన రచనలు ఇస్మాయిల్‌వి. ఇప్పటికి అయిన కొన్ని తర్జుమాలు సరిపోవు. శ్రీ ఫణికుమార్‌లాంటి వాళ్ళ కృషినింకా త్వరగా కొనసాగించాల్సి ఉన్నది. అలాంటి కృషి జరిగితే కాని నిద్రపట్టక, రాత్రి కారు ప్రయాణం (అశ్లీల కవితే అనుకోండి), చిగిర్చే చెట్టు వంటి కవితల్లోని ఇస్మాయిల్ మహాప్రతిభ, భావచిత్ర సృజన శక్తి ప్రపంచానికి తెలియవు.

శ్రీ శేషేంద్ర శర్మగారి నా దేశం నా ప్రజలు ఇవేళ గ్రీకు భాషలోకి అనువాదం అయి మన కవిత్వాన్ని అంతర్జాతీయ స్థాయికి ఎలా తేగల్గిందో, ఇస్మాయిల్ కవితలు కూడా విదేశీ భాషల్లోకి అనువాదం అయితే ఆ స్థాయి అలాగే ఇంకా బలపడుతుంది

ఇస్మాయిల్‌లో మధురోహలతో పాటు, తాత్త్వికభావాలనీ, రాజకీయ భావాలనీ కూడా ఎంతో కవితామయంగా మనం చూస్తాము. ఇదిగో నా శక్తి ఇంతటిది–చూసుకోండి–అని ఛాలెంజ్ చేస్తున్నట్లుగా అనిపించే కవితల్ని చూస్తాము! అన్నింటికీ మించి స్వేచ్ఛాప్రీతినీ చూస్తాము. పికాసో అన్న కవిత స్వేచ్ఛ అన్న భావానికీ దృశ్యం, రైలుగేటు, సృష్టి, పాట అనే కవితలు తాత్త్వక భావాలకూ; వడ్రంగి పిట్ట, పార్టీ(గా) మహాసభ అన్న కవితలు రాజకీయ భావాలకు ప్రాతినిధ్యం వహించే గొప్ప కవితలు. ఈ కవితలన్నీ కూడా తెలుగు కవితను ఎన్నో మజిలీలు ముందుకు నడిపించాయి. పద్య సమాధి, చిలుకలు వాలిన చెట్టు, కవిత్వ భిక్షాందేహి, కావ్యయోని మొదలైన కవిత్వం మీది కవితలు కవిగా ఇస్మాయిల్ కీర్తిని శాశ్వతం చేసేవి.

శేషేంద్ర శర్మ ప్రతీకకు ఎట్లా ప్రఖ్యాతి పొందాడో, ఇస్మాయిల్ అట్లా భావచిత్రానికి ప్రఖ్యాతి పొందాడు. కవిత్వ భిక్షాందేహిలో ఈ కవి రాసిన "కొత్త పదచిత్రం దొరికిన/కవిలా మొహం పెడతాడు/బాగుందీ పలుకు/వేగిరం ఇంటికెళ్ళి/కొత్త కవిత్వం వండాలనే/ఆతృత కనపరుస్తాడు" అన్న పాదాలు భావచిత్రాలపై ఇస్మాయిల్ ప్రత్యేక దృష్టిని తెల్పుతవి. 'వడ్రంగి పిట్ట' కవిత ఇస్మాయిల్ విభిన్న భావచిత్రాలను కలిపి ఎలా పాఠకులకు ఒకే అనుభవం కలిగేటట్లుగా వండగలడో నిరూపిస్తుంది. 'కావ్యయోని' అన్న ఇస్మాయిల్ కవిత కవిత్వం ఇంద్రియ జ్ఞాన జన్య కళ అన్న విషయాన్ని నిరూపిస్తుంది. పంచభూతాలు పంచజ్ఞానేంద్రియాల కెలా జ్ఞానం కల్గిస్తాయి? అవి ఆ జ్ఞానాన్ని తిరిగి ఎలా కావ్యయోనినుంచి ప్రసవిస్తాయి? అన్నవి ఎంతో రమణీయంగా ఇస్మాయిల్ ఈ కవితలో చెప్పారు.

ఇస్మాయిల్ కవితల మీద ఎంతైనా రాయవచ్చును. నేటి అగ్రశ్రేణి జీవత్కవులు ఇద్దరు ముగ్గురిలో ఇస్మాయిల్ ఒకరు కవిత్వ ఆత్మ తెలిసిన వాడు–సౌందర్య దృష్టి ఉన్నవాడు; ఆశయాలు ఉన్నవాడు, నిశ్శబ్దంగా అనుభూతి కవితోద్యమం నడుపుతున్నవాడు, అనేక యువ కవులకు పరోక్షంగా దారి చూపుతున్నవాడు, చెట్టు నా ఆదర్శం, మృత్యువృక్షం, చిలుకలు వాలిన చెట్టు, రాత్రి వచ్చిన రహస్యపు వాన అన్న కావ్య సంకలనాలను రాసిన వాడు, భావుకుడు. స్వేచ్ఛా ప్రియుడూ అయినవాడు. ఎవార్డులకన్నా బరువైనవాడు ఇస్మాయిల్. ఆయన ప్రభుత్వ కళాశాలల్లో తత్త్వశాస్త్ర అధ్యాపకుడుగా పనిచేసి పదవీవిరమణ చేశాడు. చెలంగారి సన్నిహితుడు వజీర్ రహ్మాన్ ఆయన తమ్ముడు. దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి మీద వారికి గురుభావం.

ఆయనకు తెలుగు విశ్వవిద్యాలయంవారు రెండు ఉగాదులముందు బహుమతి నిచ్చారు (నిజమే చాలా చిన్న సత్కారం అది!). ఆయనకు 60 వసంతాలు నిండినప్పుడు ఆయన పాఠకులు, అభిమానులు హైద్రాబాద్‌లో ఆయన కావ్యాలన్నీ కలిపి 'ఇస్మాయిల్ కవితలు' అన్న చక్కని సంపుటం తెచ్చారు. సాహిత్యానికిది ఎంతో గొప్ప సేవ. ఆ నాడు సి. నారాయణ రెడ్డిగారు వారిని అభినందించారు. అది ఎంతో గొప్ప సహృదయత. శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు తనకు బాగా నచ్చిన కవులలో ఇస్మాయిల్ పేరు మొదటగా చెప్పారు. అది ఇస్మాయిల్ సత్తాకు తోటి కవినుంచి వచ్చిన గొప్ప కితాబు. ఆయనకు విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖల మీద మంట! ఫరవాలేదు, ఈ వ్యాసం రాస్తున్నవాడూ విశ్వవిద్యాలయం వాడే! ఈ పత్రిక సంపాదకులూ విశ్వవిద్యాలయాల వారే! పోగా తెలుగు శాఖల్లోని అధ్యాపకులే! పాపం శమించుగాక! ఇస్మాయిల్ వర్ధిల్లుగాక!

# ఇస్మాయిల్

## బోటులో టాగోర్

పద్మానదిపై
పడవలో కూచుని
ఒకటి రెండు మబ్బు బెలూన్ల కింద
ఒంటరిగా టాగోర్.

బిగిసిన జలచర్మంతో
నిగనిగలాడే నది బాజా
కడచి పోయిన
పడవల్నీ
తేలిపోయిన
తెలి మబ్బుల్నీ
నెమరేసే పద్మకు
కడుపునిండా
సుడి గుండాల్లా
కోట్ల కొద్దీ
కథలు.
నది బాజాని మోగించే
సదా బాలకుడు టాగోర్.

ఏకాంత నౌకాయానంలో
ఏమేం కథలు విన్నావు, టాగోర్ ?
మూగపిల్ల 'సుభా' గుండెల్లో
ముసురుకున్న కేకలు విన్నావా ?
బాల్య యౌవనాల మధ్య గతుకులో
'ఫటిక్' మనస్సు పుటుక్కు మనటం విన్నావా ?
ప్రళయంలోంచి తప్పించుకు ప్రేమ
వలయంలో పడ్డ 'నీలకాంత్' వ్యథవిన్నావా ?
పదిలంగా దాచుకున్న

యెదలో బొమ్మ బద్ధలవగా
గాయపడి 'కాబూలీ' పెట్టిన
గావు కేక విన్నావా ?
ఇంకేమేం విన్నావు, టాగోర్ !

మా చిన్నప్పుడు
మమ్మల్ని మబ్బుల
దరువులు వాయించే
దొరువుల మృదంగాలు
వింత ఈసులతో
చెంతకు పిలిచేవి.
చడ్డీల్ని ఊడ్చేసి
ఒడ్డున పడేసి
మాతృ గర్భంలోకి
మరల పోచూపే
పిల్లల్లాగో,
ప్రియురాలి అంతరంగాల్లోకి
లయమవాలనుకునే
ప్రేమికుల్లాగో,
చిరంతనపు లోతుల్లోకి
చివాల్న దూకే వాళ్లం.

ఆకాశమంత లోతైన
ఆ కాసారా లెండిపోయి
బీటలు పడిన గుండెల్ని
బైట పెట్టాయి నేడు.
పద్మని పగలగొట్టి
పంచుకున్నప్పుడు టాగోర్,
ఎన్ని వికృత శబ్దాలు
ఎన్ని హాహాకారాలు
ఎంత బీభత్సం !
అంతటితో బాల్య
మంతమైంది.

సరిత్రీర నికుంజాల్లో
నిరీక్షించేవి
మెరిసే కళ్లు కావు,
గురి తప్పని
గుడ్డి తుపాకులు.
వసంతాన్ని మోసుకువచ్చే
పసిడి పిట్టలు కావెగిరేవి,
మృత్యువును నోట కరచుకున్న
హత్యాకారి బుల్లెట్లు.
మోగటం లేదు
టాగోర్, ఇవాళ
హృదయంగమాలైన బాల్య
మృదంగాలు
జబ్బులతో, ఆకలితో
ఉబ్బిన
పిల్లల పొట్టల డోళ్లు,
ఎల్లెడలా వాటి చప్పుళ్లు.

# కొండేపూడి నిర్మల

## ఎంతెంత పందెం?

ఎంతెంత పందెం ?
వాజులో ముడుచుకున్న కాయితంగుండె నలిగి పోకుండా
పెదవి మీద ఎడారి నవ్వు వాడి పోకుండా-
పదేళ్ళాగి చూడు యిలాగే వుంటాను.
కర్కశ హస్తాల్తో కాలెండరు పేజీలు చింపిపోస్తూ-
నా పాదాలిప్పుడు మన స్వప్నతీరాల ముద్రవెయ్యడం లేదు
నా గొంతులో నీ పాటలు నిద్రలేవడం లేదు
శ్రీకారం చుట్టే ప్రయత్నంలోనే వున్నాను
సిరా చుక్క తొణకనే తొణికింది
అంత మాత్రాన అంతా అయిపోయిందనుకోను
ముప్పాతిక తెల్లదనం నేను చల్లే నీలి ముత్యాలకోసం
ఎదురు చూస్తూనే వుంది
ఒక్క నిట్టూర్పును నిశ్శబ్దంలో పాతి పెట్టాలంటే
ఎంత కరిగి బిగుసుకు పోవాలో !
నన్నడుగు చెప్తాను.
తడి పచ్చిక కొసలు తగిలి
త్రుళ్ళి పడ్డ నీ కవోష్ణ పాదానికేం తెలుసు ?
నిలువెత్తు చలి ముల్లును భరిస్తున్న
ఈ మబ్బుల పూరిల్లు
చేదుగాలి మోసే బాధ్యత నువ్వెలాగూ తీసుకోవు
కురచతనాన్ని వేలెత్తి చూపకు
గొంతునిండా కన్నీటిని పుక్కిలించి
పెదవులమీద తేనెరంగు దిద్దుకుదే అర్దు
నీకు శిక్షగా వేస్తాను

## టి. వి. ఎస్. రామానుజరావు

### చీకటి

ఈ చీకటి
నా చుట్టూ
ముసురుతుంది.
కదలి
నా మేనిపై
ప్రాకుతుంది.
నా కనులు
దాటి
అనంతాకాశానికి
ఎగబ్రాకుతుంది.
రెక్కలు తెగి
మనో పావురం
వెలుగుకై
తడుము లాడుతుంది
కూలుతున్న భవనంలో
ఊడిన యిటుకై
ఆశాకిరణం
నేల రాలుతుంది.
విరిగిన కిటికీలోంచి
శిశిరం
శిథిల జ్ఞాపకాలను
మోసుకొస్తుంది
ఆవేశం
ఆత్మహత్య చేసుకుని
ఆక్రందన
శవంలా వ్రేలాడుతుంది.

## రిటైరయినప్పుడు...

రిటైరయినప్పుడు
రేపు శూన్యమై
డీప్ ఫ్రిజ్‌లో
ఘనీభవిస్తుంది.
చైతన్యం
సమాధి మెట్లు
ఎక్కుతున్నట్లుంటుంది.
అలవాటయిన ఆఫీసులో
అడుగుకు
గేటు దగ్గర జవాను నవ్వు
కాళ్ళలో
మేకు దిగ్గొట్టినట్లుంటుంది.
నెల ఒకటికి
జేబులో నెలవంక
అమావాశ్య నాటిలా
అదృశ్యమవుతుంది.
రూపాయికి
రాగాలొచ్చి
ఆప్యాయతల తీగెలు తెగుతాయి.
విశ్రాంతి,
తీరిక
వూత పదాలై
మాటకో ఏడాది
వయసు పెంచి
వంకీ కర్ర చేతికొస్తుంది.
ద్వంద్వ ప్రవృత్తులకు
ద్వైధీ భావాలకు
గెలుపోటముల మధ్య
మేల్కొని మరణించడం లాంటిది
రిటైర్‌మెంట్ !

# తంగిరాల సుబ్బారావు

## 'శివాజీనగర్ ఆంటీ'

1

బెంగుళూరులో శివాజీనగర్ ఒక పేట
కన్నింగ్‌హామ్ రోడ్డు కలువపూల బాట
వీపు మీద సిరిసంపదల టయోటా కార్లు మోసే ఆవీధివాడ
ఎత్తైన భవనాల మధ్య నీటుగావుండే మీ చిన్నివాటా చూడ
నా జ్ఞాపకాల రంగులకలల అద్దాల మేడ
పిల్లా జెల్లాలేని ప్రశాంత వాతావరణం నీడ !

2

కలకలలాడే గుండ్రటి ముఖం
చెక్కిన చిలకముక్కు కోటేరు వేసినట్టు
మాటాడితే పాట పాడినట్టు
పెసరకాయల్లా సన్నని పెదవులు
చురుకు చూపుల సోగకళ్ళు
బామన బాయ ఒళ్ళు
గుమ్మడి పువ్వులా కుదుమట్టం ఆకారం
కాంతమ్మగారూ ! మీరు
మూర్తీభవించిన సౌజన్యం సంస్కారం !

3

నాలుక మీద చకచకలాడే ఇంగ్లీషు భేషు భేషు
మనసునిండా తమిళ సాహిత్య పరిమళం సెభాషు
ఆలోచనల లాపాయింట్లు సాగుతాయి పెద్దపెద్దగా
మధ్య మధ్య మద్రాసు యాస తెలుగు ముద్దు ముద్దుగా
"యామండోవ్ ! ఈ పటం నిండా బాగుంది"
("ఏమండోయ్ ! ఈ సినీమా చాలా బావుంది")
అతిథుల్ని చూస్తే మీమనసులో అన్నపూర్ణ వెలుస్తుంది

గరిటె పట్టిన మీ చేతిలో నలభీమపాకం స్రవిస్తుంది
నాకు చల్లని తల్లిలా అన్నం పెట్టారు
మా పిల్లల్ని మీ కన్నపిల్లలుగా భావించి దారి చూపెట్టారు
మా ఆవిడ మీకు సొంత చెల్లెలి కన్నా ఎక్కువే
మీ మంచితనం గురించి ఎంత చెప్పినా తక్కువే
విశ్వవిద్యాలయంలో నా ఉద్యోగ పరంపరాభివృద్ధికి మీరు అదృష్ట దేవత
నా జీవితం పొడుగునా బెంగుళూరు శ్రీచందనంలా గుబాళిస్తుంది మీ
స్నేహం భావుకత !

4

ఇరవై వసంతాలు దొర్లినా
మీ తోటలోకి ఆమని తొంగి చూడలేదు
ఏ తరువుకూ చిగురు జాడ లేదు. పూల నీడ లేదు
ఏ కోయిలా గొంతు విప్పి పాడలేదు
అదే మీ బ్రతుకును పొడిచిన బాధాశూలం
అదే మీ కన్నీటి గాథా మూలం !

5

మహానగరంలో పుట్టి పెరిగినా
చదువూ సంస్కారం వంట బట్టినా
మొరటుతనం, మూర్ఖత్వం, అనాగరకం, బద్ధకం పేరుకుపోయిన
ఎం సి.పి. బురదలో కూరుకు పోయారు.
పెళ్లినాటి కండిషన్ కోసం లాయరు పనిమానుకున్నారు
పతిదేవుణ్ణి మెప్పించడం కోసం క్షణక్షణం మీ వ్యక్తిత్వాన్ని చంపుకుందుకు
పూనుకున్నారు
పిల్లలు లేరని వేధిస్తున్న మొగుణ్ణి మళ్లీ పెళ్లి చేసుకోమన్నారు
మీ ఆత్మానంద సౌధద్వారాలు ఒక్కటొక్కటే మూసి వేసుకున్నారు
ఏకాకితనం మర్రి చెట్టుకి
శోకం ఉరిత్రాడు బిగించుకున్నారు
పిల్లలు పుట్టని గర్భకోశాన్ని పెరికించుకున్నారు
ఎర్రకణాలు తెల్లబడుతుంటే
మీ బ్రతుకును చూచి మీరే రక్తహీనంగా నవ్వుకున్నారు.
మొగుడి విషమరతినీ, మగసిరి ఓటమినీ, బృహన్నలత్వాన్నీ

కడుపులో దాచుకుంటుంది కట్టుకున్న పెళ్లాం.
కాని, పెళ్లాం జడత్వాన్నీ, గొడ్డుమోతుతనాన్నీ ఇర్లెక్క చాటుతాడు మొగుడు
మోటు మొగుడి సూటి సోటుమాటల ఈటెలమీద
పెళ్లాం మనసు పూలమాల పడక
ముళ్ల డొంకల్లో లేతపాదాల నడక!
అమ్మా! మీ అభయహస్తం నీడలో మళ్లీ పెళ్లి గుళ్ళో
అరవైయేళ్ళ మొగుడి తాళి ఇరవైయేళ్ళ పెళ్లాం మెళ్ళో.
మీ పడకగదికి మీరే వేసుకున్నారు గొళ్ళెం
అరి మసిబారిన హారతి పళ్ళెం
మీ సంతోష తురంగానికి కళ్ళెం!
చీకు ముల్లులా సలిపే చీకటిలోకి నెట్టబడి
బ్రతుకు నరకయాతనల భల్లూకానికి పట్టుబడి
కండలు కండలగా చీల్చబడ్డ మీనిండు జీవితం
నా కళ్ళకు కట్టిన దుర్భర చిత్రం!

6

బియ్యేస్సీ చదివిన 'రూప్ కన్వర్'
పాతివ్రత్యంకోసం పతి చితి మీద పడింది.
బియ్యేబియ్యల్ చదివిన మీరు
భర్తవంశ వృక్షాభివృద్ధికోసం
మిమ్మల్ని మీరు ఎరువుగా చేసుకున్నారు
దాని కొమ్మకే ఉరి పోసుకున్నారు.
సహగమనం చేయడానికి సైన్సు డిగ్రీ చదవక్కర్లేదు
మొగుడి అహంకార తరువుకి ఎరువుగా మారడానికి లాడిగ్రీ అక్కర్లేదు
అడవిలోని మాను కన్నా హీనంగా బ్రతికే
ఏ పల్లెటూరి పిల్లైనా చాలు!

7

కాంతమ్మగారూ!
కంచి పట్టుచీర సరిగంచు గరగర మీరు;
మంచి భోజనంలో రుచి మీరు;
షావుకారుపేట పూల మార్కెట్టులో పెద్ద ఆదోక కదంబ పూలమాల మీరు;
మెరీనా బీచ్‌లో చల్లని గాలి తరగ మీరు.

గీతాంజలి అయ్యర్ టీ.వీ. గొంతులో రేవి మీరు ;
గొప్ప సంస్కారం సౌజన్యం మీరు, సంస్కృతికి మారు పేరు మీరు ;
మా జ్ఞాపకాల వెక్కిలి మీద
ఎన్నటికీ ఆరని కన్నీటి చారిక మీరు ...
ఓ మా పిల్లల "శివాజీనగర్ ఆంటీ" !
పురుష దురహంకారం మీద తిరగబడుతున్న నేటి స్త్రీవాదానికి
మీ స్లో పాయిజన్ ఆత్మబలి యాంటీ !!
కాంతమ్మగారూ !
కావేరీ తీరంలోని మీరు
రాజమండ్రీ వచ్చి మా గోదావరిని చూస్తానన్నారు,
కాని, ఇంతవరకూ ఎవరికీ అర్థం కాని,
చీకటి సముద్రంలో ఏకమై పోయారు,
కనీసం, ఇదిగో మా కోసం ఎలుగెత్తి ఏడ్చే
మా సంసార కవోష్ణ బాష్పధారా గోదావరిని చూడండి !!

* ** **

"మనిషికోసం కవిత్వం
మంచికోరి నవత్వం
అయినా కవిత్వాని కేముందిలే విలువ
అది ఎవ్వడూ మొయ్యలేని సిలువ" —శ్రీశ్రీ

## పెన్నా శివరామకృష్ణ

### ప్రవాహ పాంథశాల

స్మృతుల మీది బూడిదను కలలగాలి
ఊదేస్తున్నది-
ఉదయాన్నే కలలకు
అశ్రు పుష్పాలతో శ్రద్ధాంజలి-

దేహాన్ని అవయవాలతో బంధించడానికి
చిక్కుపడ్డ దారపు కొసకొరకు
సూర్యకిరణం అన్వేషణ-
జేబులో మళ్ళీ నాలుగు
అగ్ని పుష్పాలతో ప్రయాణం-
నా వెనుక పెట్రోలు ధారకు
అగ్ని సర్పం ప్రాకుతున్న శబ్దం.
నా ముందుపాత సైకిల్ చక్రాన్ని
దొర్లించుకుంటూ పోతున్న కుర్రవాడు.
రేపుమంటల మాటలు నేర్చుకునే
ఏ మూగ కొయ్య మీదవో
నా పేరు చెక్కాలని
మెదడును తొలిచే ఆలోచన.

నిద్రలో నడిచినట్లు శవయాత్రలో ప్రయాణం.
పేరు పెట్టుకునే ప్రయత్నంలో
అసలు పేరే మరిచిపోయిన క్షణాన
మూరెడు వస్త్రాన్ని బారెడు నదితో
కొలుచుకుంటూ
ప్రవాహం మీద ఆరేసుకోబోయి
పారేసుకున్న క్షణాన

అంతర్బహిర్ వృత్తాల సంఘర్షణలో
దారానికి ఏ కొసా దొరకదు

కవాటాలు తెరుచుకుంటూ
మూసుకుంటున్న శబ్దం
వృథా వ్యథాగానం
ఏ చౌరస్తాలు లేనిచోట కూడా
ఒకేవైపుదారి

ఆద్యంతాల చీకటి రహస్యాల
ప్రవాహ పాంథశాలలో
బంధం గృహనిర్బంధం.

* * *

"వర్షం వెళ్ళిపోయింది
మబ్బుల రథాలెక్కి
జలదానం చేసిన మేఘాలకి
జోహార్లు చెప్పాయి చరాచరాలు
భూమిలో ఉన్న చిన్నారి గింజ
మెడ బయట పెట్టి మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది
కృతజ్ఞతతో" —శేషేంద్ర

## కొండిబోయిన ఆంజనేయకుమార్

### గడియారం

శూన్యంలో ముళ్ళను రెక్కల్లా కొట్టుకునే
గడియారం
విశ్రమణలను నిర్లక్ష్యంగా కొట్టిపారేస్తుంది.
తన అద్దాల శూన్యంలో కూడా
గాలి ఉందని కాబోలు
గడియారానికి గర్వం
గాలి పోయి శూన్యమైన మానవ కళేబరాన్ని
చూసీ చూడనట్లు చూసి
ఏదో విచిత్రమైన అవిచిత్రాన్ని
సృష్టించబోతున్న
పికాసో కాన్వాసు అవుతుంది
గడియారం ఒక్క క్షణం
తన ముళ్ళరెక్కలను టపటపలాడించి
తన 'టక టక'ల ట్రాకులోనికి
ఏమీ ఎరగనట్లు వెళ్ళిపోతుంది.
ఎంత రాతి గుండె గడియారానిది
ఒక్క క్షణం కూడా మౌనం పాటించదు
వాడు పోయినందుకు కాక
వాడి కొడుక్కి ఉద్యోగం వస్తున్నందుకు
ఏడుస్తున్న వాళ్ళని చూసి
పదీ పది అవుతుంది గడియారం.

## దర్భశయనం శ్రీనివాసాచార్య

### కత్తులు కత్తులుగా

కత్తులు కత్తులుగా
కాలం రాలుతున్నపుడు
శబ్దం భారమే
నిశబ్దమూ భారమే

తలుపులుగా తలుపులుగా
చౌరస్తాలు మూసుకున్నపుడు
ఆగడం కష్టమే
సాగడమూ కష్టమే

సందేహాలు సందేహాలుగా
కళ్ళు రెపరెపలాడేప్పుడు
ఒంటిగా మిగలడం సమస్యే
గుంపులో కదలడమూ సమస్యే

రాత్రులు రాత్రులుగా
పగలు చిక్కబడినపుడు
విశ్రామం దుర్భరమే
ప్రయాణమూ దుర్భరమే

శిబిరాలు శిబిరాలుగా
మనుషులు చీలిపోతున్నపుడు
మంటలు అనివార్యమే
యుద్ధమూ అనివార్యమే

## మిరియాల రామకృష్ణ

### రైలింజన్

నువ్వు చెప్పేది అందరూ ఒప్పుకుంటారనుకోవద్దు
వారివారికి నచ్చడం, నచ్చకపోవడం
వారివారి అభిరుచులకూ నేపథ్యాలకూ సంస్కారాలకు
వదిలేయగల్గినప్పుడే నువ్వు చెప్పడం మొదలెట్టు !

తూకం వేసి చూస్తే రెండూ ఒకటే బరువుంటాయి
ఒకటి అభినందన రెండు అభిశంసన
రెండూ తలమీద పెట్టుకు మోయడం నిజంగా కష్టమే
నిందించినా అభినందించినా నిజమవునో కాదో
చూసుకోవడం కూడా నిజంగా కష్టమే అయినా
వాటిని మోయకా తప్పదు, దించుకోకా తప్పదు.

ఆయా ఫలితాలను కిందికి దించుకోవడానికి
ఎంతటివాడైనా తల కిందికి దించుకోవాలి
అప్పుడంతగా ఆలోచించ కూడదు మాటాడకూడదు
రైలింజను స్టేషనులో ఆగినట్లు- అంతే !

గంట కొట్టగానే ఇంజను మళ్లీ కూత కూసినట్లు
నిశ్శబ్దపు గూటిలో నిద్రవాలించి మళ్లీ
బయటకు వచ్చి మైదానాల్లో నిలబడి సాదాగా
నువ్వు చెప్పదలిచింది చెప్పడం మొదలుపెట్టు !

అయితే ఈ మాటు ఆ రెండూ కూడా కోరుకోకు
చెప్పదలిచింది చెప్పిన తరవాత
ఎలా ఉంది ? ఏమంటారు ? అని ఎవ్వరినీ అడగకు
ఎవరికి కావలసిన దాన్ని వాళ్ల అభిరుచుల,
నేపథ్యాల, సంస్కారాల మేరకు స్వీకరించి పోతుంటారు !

# దేవరాజు మహారాజు

## యుగపురుషుడు

వాడు సింహాల్ని లొంగి పొమ్మంటాడు
పులుల్ని దిగి రమ్మంటాడు
అరణ్యాల్ని తల వంచమని,
అగ్నిని ఆరి పొమ్మనీ శాసిస్తాడు
పిట్టలకు తుపాకు లిస్తానంటాడు
గుట్టలకు పసుపురంగు పూస్తానంటాడు
రోడ్డు మీద పడకేసి శేషసాయి ననుకుంటాడు
పరిపూర్ణ అజ్ఞాన సర్వస్వంగా విరాజిల్లుతాడు
తనను మించిన క్రామేడ్ లేడని
బాబాలా చేయి విసురుతాడు

నిజమే మరి. తన అహంకార జ్వాలలలో
తనే తగలబడి, బూడిదలా రాలుతాడు
ఈ సువిశాల విశ్వంలో
సంకీర్ణ సమాజంలో కేవలం ఒక
అహంకారం విలువ ఎంత అని
వాడాలోచించడు-

చరిత్ర ముఖం మీద
పులిపిరిలా
అసహ్యంగా మిగులుతాడు.

## అడిగోపుల వెంకటరత్నమ్

### నిశ్శబ్దం నినాదమై

చూపుకు రెప్పలు
ఒక్కోసారి కారు మబ్బులు.
నీ చూపు నిర్విరామంగా ప్రసరిస్తూనే వున్నా
లాలిత్యాన్ని పంచాల్సిన గూటికి
కాఠిన్యాన్ని ప్రదర్శించాల్సిన చోటికి
చేరదు !
అది నీ క్షోభిత
వ్యధిత హృదయం మళ్ళించి
వర్గప్రేమతో
జీవితకాలం కారు మబ్బులు
పెనులబ్ధిపొందే ప్రయత్నం !
ప్రాణికి ప్రాణికి మధ్యనున్న
ఎడాన్ని
నిశ్శబ్దాన్ని ఆక్రమించి
ప్రాణి ప్రాణి ఏకంకాకుండా
నిశ్శబ్దం శబ్దంగా మారకుండా
వేళ్ళూని శాఖోపశాఖలై నిలుస్తాయి !
నీ లాలిత్యాన్ని పంచుకొనే గూళ్ళు
నీ చూపుల గ్రహణం చూసి
నీ దరికి కదిలొస్తే
ప్రాణి ప్రాణి సమన్వయమై
అన్ని బిందువుల కలయికతో అంబుధి చేసి
నిశ్శబ్దం నినాదం చేసి
విశ్వరూపం ధరించి
సమరానికి సమాయత్తమౌతాయి !

# కందాళై రాఘవాచార్య

## పాటల 'లత'

పాషాణాలు పాటకు లతలౌతాయి
కోటలు పాటముందు ఖడ్గాలను విశీర్ణించి హృదయాలను పారేసుకుంటాయి
పాములు పుట్టలను బహిష్కరించి పాటముందు విషాన్ని భంగం
చేసుకుంటాయి
పాట ముందు జాతులు వర్ణాలు విలీనమై విశ్వంగా వృత్తరేఖనాలౌతాయి
పాటకు సభలు చెవల నిండా చప్పట్లను కొట్టుకుంటాయి
తెలియకుండానే కాళ్ళతో రాగాల సముద్రాల మీద తేలిపోతాయి
రాగంలోంచే పుడుతుంది తూర్పు రేఖ మీద సూర్యోదయం
వసంత ఋతువూ పాటలోంచే విచ్చుకుని సుగంధమై భూమి నిండా
అల్లుకుంటుంది
కోయిలంటే పక్షి అని ఎవరన్నారు
అది కొమ్మమీంచి కొమ్మకు ఎగిరే పాట
మేఘాలు చినుకుల మందలై రావటం పాట ఆటాడినందుకే
పాట అంటే నాగలి గీతపడి పచ్చగా నవ్వే పల్లె
పాట అంటే ఊయలలో ఏడ్పుమాని అమ్మ ఒడిలో రాజ్యమేలే శిశువు
పాట ఊపిరితిత్తి - పాట హృదయం
పాట ఎగిరే పక్షి రెక్క
పాట నిరంతరం సంక్షుభిత తుఫాను సముద్రంపై
సాహసంగా తెరచాప దించక అలవని తెడ్లతో దారి కట్టేపడవ
పాట ప్రేయసి కాలి అందెకు హృదయ స్పందనలు నేర్పుతుంది
పాట ఆలోచనా నేత్రానికి బాష్పాన్నిస్తుంది
ఏ దేశం పాటను బహిష్కరిస్తుందో ఆ దేశంలో శ్మశానం రాజ్యం చేస్తుంది
ఏ దేశం పాటను ఆహ్వానిస్తుందో ఆ దేశం అమృతాల ఊటౌతుంది
పాటకు వయస్సు లేదు- పాటకు పరిధి లేదు
పాట ప్రతి ఒంటి నిండా లత– పాట శరీరం విశ్వం
(అరవై వసంతాల పాటల లతామంగేష్కర్‌కి)

స్త్రీవాద కవిత్వం :

## సావిత్రి

### బందిపోట్లు

"పాఠం ఒప్ప చెప్పకపోతే పెళ్లి చేస్తా"నని
పంతులుగారన్నప్పుడే భయమేసింది.
"ఆఫీసులో నా మొగుడున్నాడు!
అవసర మొచ్చినా సెల వివ్వ"డని
అన్నయ్య అన్నప్పుడే అనుమాన మేసింది.
"వాడికేం? మగ మహారాజు" అని
ఆడా మగావాగినప్పుడే అర్థమైపోయింది —
"పెళ్లం"టే "పెద్ద శిక్ష" అని,
"మొగు"డండే "స్వేచ్ఛా భక్షకు"డని,
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని !

### గృహిణి

ఉపాధి లేదు, జీతం రాదు,
సెలవు లేదు, సేద తీర్చే నెలవూ లేదు.
'డ్యూటీ'లున్నాయ్, ఓ.టీ.లున్నాయ్ —
సూటీ పోటీ మాటలూ వున్నాయ్,
బోరు కొట్టే ఈ చాకిరీకి బోనస్ లేదు.
ఎప్పుడైనా 'భజన' తప్పించి ఎక్స్‌గ్రేషియా లేదు
అయినా—
ప్రచార సాధనాలంటాయ్— నేను 'పని లేని స్త్రీ'నని !
భాషేరాని బడుద్ధాయి లంటారు— నేనే ఒకడికి భార్యనని!

(సేకరణ : శ్రీమతి కె. రాజేశ్వరి)

# భగ్వాన్

మెలకువ

దృశ్యాలను మింగుతూ
దుఃఖాలను స్రవిస్తున్న నేత్రాలు
చూపుల విసిరినంత మేరా
బతుకు రహదారి మొలుస్తుంది.
పిడికిలి
గాలిలో ఊగుతున్నంత పేపూ
గమ్యం
పెదవులపై పల్లకీ అవుతుంది.
జీవితపు మాధుర్యాలను దోచుకునే
రెండు ముఖాల రాక్షసుల చూపులు
మన చుట్టూ గోడలు కడతాయి.
ఆ గోడలు
మనసుల మధ్య కలతలు రేపుతాయి.
భేదాభిప్రాయాల నడుమ లేచి
హత్యలు చేస్తాయి.
దేవుడి కళ్యాణం పందిరిలోని
రికార్డింగ్ డాన్సులాగే
బతుకులో మోసాలు నటిస్తాయి.
మనసుకు మేకులు దిగ్గొట్టే చేతులు
కరవాలనాలిస్తూ
గులాబీపూల కింద దాగిన ముళ్ళలా
కసుక్కున కాటేస్తాయి.
జీవితాలను తడిమే
అనురాగపూరిత హస్త స్పర్శలు
కవిత్వం చెబుతాయి.
నదిని కోస్తూ
ముందుకు సాగే పడవలా

మౌన గర్భాన్ని చీలుస్తూ
కవిత్వం
గుండెలకు చూపునిస్తుంది.
ఆ చూపును గుచ్చుకున్న కన్నుల్లాగ
ఆ చూపుమ బిగించుకున్న పిడికిళ్ళలాగ
ఆ చూపును
వెన్నెముకగా అతికించుకున్న వ్యక్తిత్వంలాగ
అప్పుడు
మవ్వు నిద్ర లేస్తావు.

* * *

"సౌందర్యం ఆరాధించే వాడా
కవితలో, శిల్పంలో, పురుగులో, పుష్పంలో
మెరుపులో, మేఘంలో
సౌందర్యం ఆరాధించే వాడా
జీవించే వాడా
సుఖించే వాడా, దుఃఖించే వాడా
విహ్వలుడా, వీరుడా
ప్రేమించేవాడా
వియోగీ, యోగీ, భోగీ, త్యాగీ!

—శ్రీశ్రీ

# కీ. శే. డా. చిలుకూరి నారాయణరావు

('మహామహోపాధ్యాయ' కళాప్రపూర్ణ' డా. చిలుకూరి నారాయణ రావుగారు 1890లో పుట్టారు. ఇది వారి శతజయంతి సంవత్సరం. ఆయన ఎంతటి మహాపరిశోధకుడో అంతటి కవి, అంతటి నాటక కర్త కూడా. ఆయన ప్రతిభ బహుముఖమైనది. ఈనాడు మనం అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం, స్త్రీవాద కవిత్వం అనే పేర్లతో వ్రాస్తున్న కవిత్వానికి చిలుకూరి వారు 1928 ప్రాంతాల్లోనే శ్రీకారం చుట్టారు. ఆ ధోరణిలో ఉన్న మూడు కవితల్ని దిగువ ఉదాహరిస్తున్నాను. ఈ కవితల్ని డా. అవధానం నాగరాజా రావుగారి అముద్రిత సిద్ధాంత వ్యాసంనుండి గ్రహించాను. వారికి కృతజ్ఞ తలు—తంగిరాల)

## రాజులకోసం

రాజుల కోసం, రాణులకోసం
రాజపురోహిత, రాజాస్థానిక
సేనానాయక చిత్తం కోసం
గంటాలాడిన కవుల యుగాలవి
గడచి పోయినవి, నడచిపోయినవి.
కుడువ కూడును లేక, కట్ట గుడ్డయు లేక
మలమల మాడుతు, వడవడ వడకుతు
ఎండల నెండుతు, వానల తడుస్తు
చుట్టు తుపాకుల్ పట్టుక నిలిచిన
ధనిక తత్త్వమునుగని భయపడుతూ
భూమి మీదను, భూగర్భములో
సముద్రాలపై, సంద్రాల్లోపల
ఆకాశములో నక్కడ నిక్కడ
అప్పుడు, ఇప్పుడు, ఎక్కడ ఎప్పుడు
చెమటలు గ్రక్కుతు, రక్తా లొలుకుతు,
సైన్యాల్లోపల చావగ జేరుతు,

పురుగుల వలెనే ప్రాకులాడుతూ
బానిసతనమును భరించలేక
అల్లల్లాడుతు తల్లడమందే
హీనులకోసం దీనులకోసం
దిక్కుమాలిన బక్కల కోసం
ఇకముందీకల మిట్లే సాగును.
(John Masefield 'Consecration' కి అనుసరణ)

## శాసనాలు

నేనే 'సత్యం వదా'లట
నేనే 'ధర్మం చరా'లట
నేనే పన్నులు చెల్లించాలట
నేనే అణగి మణగి ఉండాలట,
తామేమో 'వద'రట, 'చర'రట, చెల్లించరట
అణగి మణగి ఉండరట
......    ....
ఇప్పటికి అడిగి పడి ఉండాలి ఏమి చెయ్యను?
కానీ, కాల చక్రం కదలుతున్నది, వస్తుందొక కాలం
దేవుణ్ణి జెయిలులో పెట్టి
మంత్రుల్ని 'మర్డర్' చెయ్యక పోతానా ?

## తమాషా కాదు

తమాషా కాదావిడతోతంటా తెచ్చుకొనేవు సుమీ!
నీకు రాని విద్యలన్నీ నేర్చుకొన్నదావిడ
నీవు చేయలేని పను లెన్నో నెమ్మదిగా చేస్తుందావిడ
కలముతోనా, కట్టెతోనా,
పొలము వద్దనా, ప్రొయ్యి వద్దనా,
మగవాడా! దేనితో, ఎక్కడ మించిపోతా వావిడను?
కవితలోనంటావా? ఆమెయే ఒక కవిత!
ఏలుబడిలోనా? దాసానుదాసుడా నీవే మేలగలవు?
మరి ఎందులో నీ ఘనత?
తుదకు పిల్లల నయినా కనగలవా?
లేకుంటే నోరుమూసుకో!

# కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి

## హిమాని

(5వ సంచికలో ప్రచురింపబడ్డ 100వ కవిత తర్వాత)

101

నక్షత్రము సంఘమందుగాని ప్రకాశింప నేరదు
చంద్రు డొక్కడే ప్రకాశింపగలడు.

102

తేనె పట్టంతయు తేనెతో నిండి యుండదు

103

భావములు నడచి పోవగా నేర్పడిన
పద చిహ్నములే అక్షరములు

104

ఫలమునందలి మృదు మధుర రసము కంటె
గట్టిగానుండు గింజలే వృక్షజాతికి విత్తనములగుచున్నవి.

105

వేళ్ళు భూగర్భమున కష్టపడి
గణించిన దాని నారగించి
వృక్ష శాఖలు కరువలతో సరస మాడును.

106

తురాయి రాజు మూర్ధమును
చిరకాలము తానే యధిష్ఠించును ;
పుష్పమో, అట్లుకాక తనస్థానమును
తన వంశీయుల కొరకు విడిచి పెట్టి పోవును.

107

మేఘము తృష్ణ లేని నదికే నీరిచ్చుచున్నది
ఎడారి దప్పిక నది గమనించుట లేదు.

108

నీటిలో పడవ పోవుచున్నప్పుడు
కెరటముల భయము నీడ కేల కలుగును ?

109

పువ్వు వికసించిన దాని వృక్షము సంతోషించుట లేదు
ఇక నేలపై బడిపోవునని విచారించుచున్నది.

110

రాజ మార్గము మనుష్యుని అడుగు సందడులకు
విసుగు కొనుచుండును ;
ఎడారి వానికై కలవరించుచున్నది.

111

పుష్ప వాసనను ప్రభువుకంటె
పుష్పలావికయే ముందనుభవించుచున్నది.

112

ఫలపుష్ప హీనములగు వృక్షముల యందు
పత్రములకే అగ్రస్థానము.

113

నక్షత్రము నిరాధార పథమున నిలువలేక
పడిపోయి యుండునని
ప్రభాతమున నేలపై పడబోవు మంచు బిందువనుకొనెను.

114

వేకువ తనయందు నించిన హిమ కణములు
తనకు నక్షత్రములంపిన కానుకలని
గడ్డిపూవు గర్వించును.

115

వీణను జేరిన తుంబీ ఫలము
తన పూర్వజన్మను తలంచు కొనుటకు సిగ్గుపడును.

116

తన తూలికలు రాజులు ధరింతురని
మరాళము సంతోషింపదు.

117

నీటిలో ప్రతిఫలించిన ఆకాశము
కలిగించెడి సంతోషము
నిజమైన ఆకాశము కలిగింప లేదు.

118

అలరును విడదీసి అందరికి పంచుట కంటె
అద్దాని నొక్కని కిచ్చుటే అభినందింప దగినది.

119

పుష్పము ఫలించిన పిదప రేకులను తీసివేయరు.

120

సార్వభౌముని మస్తకము నలంకరించినను
మునుపటి దానికంటె నెక్కుడు సౌరభమును
కుసుమము గణింప జాలదు.

121

నికుంజమునుండి తొంగి చూచిన విరి
నిర్మల హృదయమునుండి జాలువారు ప్రేమవంటిది.

122

నీటిలో కన్పట్టు నింగి నంటి
గడ్డిపోచ గర్వించిన ఘనత యేమి ?

123

పడియలు ఉప్పొంగ నంత మాత్రమున
చంద్రకాంతి వ్యర్థము కాదు.

124

ఎడారి హృదయములోని
బాటసారి పద చిహ్నమునకు
ఆకాశ వీక్షణమే ఆనందదాయకము

125

పూలచెట్టు తన సౌరభమును తాను అనుభవింప లేదు
లోభి తన ద్రవ్యమును తాను అనుభవింప లేదు.

126

తొడిమె : పుష్ప పత్రములారా ! మిమ్ములను నేను
వ్యర్థముగా మోయుచున్నాను.

రేకులు : మమ్ములను నీవు మోయు చుండుట చేతనే
మాతో పాటు రారాజు మూర్ధము నలకరించుచున్నావు.

127

ప్రపంచమును మోయుచుంటిమని
కుల పర్వతములు గర్వించును;
కుల పర్వతములను వహించునది ప్రపంచ భాగము కాదా ?

128

జలముగల కడలికే నదులు జలమునిచ్చును
జలహీనమైన ఎడారికి కాదు.

129

ఫల ప్రతిపాదమునకు లోని కింజల్క కర్ణికలు మూలమైనను
పైరేకులను జూచియే పుష్పము గర్వించును.

130

సముద్రము : ఆకాశమా ! నేను నిన్నంటి విల్చినను
నీ వేల నన్నంటవు ?
ఆకాశము : ప్రపంచ పరమావధిలో
విన్నంటు కొందును లెమ్ము !

# దీవి సుబ్బారావు

## తత్త్వాలు

1

ఒకడు పాపాలు చేసుకొంటూ పోతాడు
వాడికేం కాదు
ఒకడికే పాపం తెలియదు
కటకటాల వెనుక కుములుతుంటాడు

ఒక్కొకసారి బ్రహ్మ ప్రయత్నం చేసినా
ఉన్న సమస్య ఒకంగుళం జరగదు
వదిలేసి పూరుకుంటే
మంచులా విడిపోతుంది

కొన్ని ప్రశ్నలకు సమాధానం
తొందరగా దొరకదు
ఐనా ఆలోచన
మనల్ని ఒంటరిగా వదలదు

2

కొత్త బట్టలు తొడుక్కున్న పిల్లవాడు
స్నేహితులకు చూపించి సర్దాపడ్డట్లు
అప్పుడే రాసిన పద్యాలు పుచ్చుకొని
తెలిసిన వాళ్ళ దగ్గరకు పోతాడు కవి

చిన్నప్పుడన్నీ ఆశ్చర్యమే
చూరునుండి కాలే వర్షపు చుక్కలు
రేవులో దిగిన ఆవుల మందలు
గూట్లో కువ కువలాడే పావురాయి

ఎగిరే గాలిపటం కదిలే నీరు
దూది పింజెల్లా తేలే మబ్బులు
వెన్నెట్లో పరిగెత్తే చందమామ
పాలు తాగే కుక్కపిల్ల
కళ్ళింత చేసుకొని చూస్తుంటారు పిల్లలు
ఎప్పుడూ కొత్తగా చెప్తుంటారు కవులు
వాళ్ళు భాషను పుట్టిస్తారు
వాళ్ళు భాషను పండిస్తారు
బ్రతుకుకీ మృత్యువుకీ
మధ్య దారి కడతారు
అమ్మ ఒడిలో హాయిగా కన్ను మూస్తారు
అమ్మ చచ్చిపోతే రొమ్ము కుడుస్తూ ఆడుకొంటారు
వాళ్ళ ధ్వని ఓంకారం
వాళ్ళ ధ్యాస శ్రీకారం
లౌక్యం తెలిసిన వాళ్ళకి
అర్థం కాదు వాళ్ళ తీరు
రెండు భిన్న ధ్రువాల కావలి తీరం
వాళ్ళ వూరు

# పి. వేణుగోపాలరావు

## నా విద్యుచ్ఛలన శక్తి

కలలు నా నావలు
కాలమహాప్రవాహమందు
రోజుకొక నావపై విహరించు
మోజుగా నామనసు

తీరముచేరి భూతలలావణ్యశోభల
మదించి విహరించుమని
ఘోషించి హెచ్చరించె
కాలతరంగసంఘములు

నావకిరువైపుల తాకుచు
ఉయ్యలలూపుచు
మరుభావనల మదిపొడముచు
కాలతరంగఫేనరజములు
నెయ్యముల తనువంతనింపు

నావపై వాలి విహంగములు
స్వేచ్ఛాభావపరంపరావేశ
పుష్పసుగంధముల నాఘ్రాణించి
సంతృప్తిపడి నింగికెగురు

కారుమబ్బుల దోబూచులాడు
మెరుపుతీగల విద్యుచ్ఛక్తి
సాక్షాత్కరించి తోడునిలచె
చుక్కానియై ఒకరోజు
తనమనసు నామనసు
పలుపేటల పెనవేసి

తన మమతల నా భావముల
కలంకారములుగ తొడిగి
ముచ్చటలు మురిపెములు
గుంపులు నింపుచు
నడిపెను నా నావను

నాకితోడు సరితోడు
ఏకాగ్రత తన్మయత
జలపాతాల వాస్తవికతల
నవలీలగదాటి సాగెదనిక
సుడిగుండాల జీవితగండముల
పరిభ్రమించి తప్పించుకొనెదను

తీరపు స్థావరములకు
ఈర్ష్యలు నిలువెల్లకప్పె
ఉత్తుంగ తరంగములు
సాంగత్యమును మెచ్చె
సృజనాత్మక స్రవంతులు

పొరలె నాహృదయమున
కాలముపోయెకాలమయె
"నీవలపుల తేనెపసందులు
అధికమై మోహముమొత్తె
నీ తలపులవల చిక్కులు

నానడకల కడ్డుతగిలె
నభోమండల విన్యాసములకై
బెంగపడితిని స్వేచ్ఛలేక
మన్నించుము నేజారెదనిక"
నావవిడిచి దివినిజేరె
నా విద్యుత్చ్ఛలన శక్తి
స్థావరములు ఈర్ష్య వదలి

హర్షించి ఎగురించెను
అనంతమగు ప్రవాహమున
తరంగములు పరుగెత్తెను
విహంగములు గమనించెను
నాలోకపుటహర్నిశలు
స్థావరమొకపక్క చేరి
కలకాదిది నిజమని
వేదాంతము బోధించెను

## రాజేశ్వరి దివాకర్ల

### ఈ వెలుగు చిహ్నాలు

నీ గమనానికి
ఇచట హెచ్చరిక
ఈ రహదారిపై
సుఖ ప్రయాణం చేయవలసిన నువ్వు
ఈ మార్గసంచార దీప చిహ్నాలను
మన్నింపక తప్పదు
ఒక్కసారి
వసంతం విరుచుకుపడి
కొమ్మ బిత్తర పోయినట్లు
శిశువుగా ఉన్న
మొగ్గ
అరుణ పరాగం నిండిన పూవుగా
కన్నులు తెరచి
నివ్వెర పడినట్లు
ఎరుపు రంగుకు
మళ్ళిన
ఈ వెలుగు చిహ్నం
నీలో అలజడి కలిగింపక మానదు.
నీ ముందు వెనుకలు
నిస్పృహనంగా
నించున్న
చక్రాల రొదలు
ఇరుసులు వదలిన పొగలు,
ఈ ధ్వనులను
దూరం చేయాలని
చెవులను నిశ్శబ్దం చేయకు

ఈ పొగలను
తరిమి వేయాలని
కన్నీళ్ళు వెదజల్లకు
ఈ పరిసరాల్లో
ఇమిడి ముందుకు పోవలసిన నువ్వు
అదిగో
ఆ రంగు మారిన
పచ్చని
మార్గసంచార దీప చిహ్నం
ముందు మలుపుకు తిరిగి
గమ్యం చేరుకో మంది చూడు.

* * *

"అధికారం విధించిన ఆంక్షలు
కదిలే శ్వాసను బంధించలేవు,
అది వీస్తూ వుంటుంది
ప్రభంజనాలపై స్వారీ చేస్తూ
మట్టిలాంటి దేహంలో
మనసే కదలిక.
ఊపిరాడని దేశంలో
ఉద్యమమే కదలిక" —డా. సి. నారాయణరెడ్డి

# కరుణశ్రీ

## పాకీపిల్ల

(ఉదయం సుమారు ఏడుగంటలు. పాకీపిల్లను బాలభానుడు లాలిస్తున్నాడు. భగవతి వసుంధర ఆమె చిన్నిపాదాలను ముద్దు పెట్టుకుంటున్నది.)

తన సుఖము వీడి తోడి సోదరుల సౌఖ్య
మునకె జీవిత సర్వస్వమును వ్యయించి
ఏవ మెరుగవి నీ యమాయికపు ప్రేమ
లోతెరుగుజాల దీ స్వార్థలుబ్ధజగతి.

నీ పవిత్ర ప్రకృతి స్వదేశో పకృతికి
త్రోవ చూపించెలే మహాత్ములకు గూడ;
భరతజనయిత్రి ప్రేమంపు పసిడి ముద్దు
తొలుదొలుత నీవె అందుకొందువు గదమ్మ!

చీపురు నొక్కచేత, ఒక చేతను చింపిరిగంప బూని, యీ
పాపపు గుప్ప లూడ్చెదవు బాలిక! పీదర లేదె సుంత? నీ
యోపిక చూచి మెచ్చి తలయూచు జగత్పిత కన్నుగొల్కులన్
తేపకు తేపకున్ బయలుదేరునవే నులివెచ్చ బాష్పముల్ !!

ఆకల్పాంతము నీ పవిత్ర దినచర్యల్ నిత్యనిర్నిద్ర వి
శ్వైక ప్రేమ మహాగమమ్మునకు 'తూచా' పోని వ్యాఖ్యానముల్;
పాకీదానిగ నాడిపోసికొను ఈ పాపిష్ఠిలోకమ్ము నీ
బాకీ తీర్చుకొనంగలేదు జగదంబా! జన్మజన్మాలకున్.

కుక్షిస్థమ్మగు కుళ్లెరుంగడు; కృశాంగుం డీడ్వలే కీడ్వగా
రిక్షాలో జనుచున్న ఆ పశువు దారిన్ తొల్గిపోవంచు ని
న్నాక్షేపించును పండుకోతి వలె మోమంతా కనుల్ వేసి; ఏ
మో క్షోభించను కొంప మున్గినటు లబ్బో! ఎంత బిబ్బోకమో!

ఈ గతి నేహ్యామెల్ల సహియించి యుగమ్ముల నుండి చేయు నీ
త్యాగము గుర్తెరుంగదు గదా ! నెల కిచ్చెడి రెండణాలకే
యాగము సేయు లోకము యథార్థముగా తన సేవ కోసమే
భాగవతమ్ములోని భగవంతుడు నిన్ను సృజించినట్లుగన్.

వెల్లి ! నీ బీదమోము దర్శించినంత
విసము గురిపించు నేమి రక్కసి జగమ్ము ?
మానవత్వమ్మునే యవమానపరచు
పసరముల సంత యిది ; దయారసము సున్న.

ఒక్కరోజీవు వీథుల నూడ్వకున్న
తేలిపోవును మా పట్టణాల సొగసు.
బయట పడునమ్మ బాబుల బ్రతుకులెల్ల.

ఒక క్షణమ్మీవు దంప క్రిందకును దింప.
పావనమ్మైన నీ ప్రజాసేవ కొరకు
త్యాగమయమైన నీ జీవితమ్ము కొరకు
కార్పలేదొక్క కరుణాశ్రుకణము కూడ !!
జార్పలేదొక్క వేడి నిట్టూర్పు కూడ !!

ఉక్కు పాదాలతో నిన్ను ద్రొక్కుచున్న
పాడు సంఘమ్ముపై సానుభూతి చాలు ;
కడుపు గడవంగ చాల మార్గములు గలవు.
బైట బడుమమ్మ ! ఈ మూగ బ్రతుకు నుండి.
'పాకీపిల్ల' వటంచు నిన్ను నిరసింపంజాతురమ్మా ! స్వయం
పాక స్వాములు కొంతమంది ; ఇది యే పాపంబొ ! మూన్నాళ్లలో
నే కన్నుల్ తలకెక్క వెన్క గనరీ నిర్భాగ్య దామోదరుల్ !!
పాకీదే గద మాకు మా జనని బాల్యమ్మందు సంజీవనీ !

మాతృస్థానము నందుకొన్నయది యుష్మన్మూర్తి లోకాన ; ఈ
హాతీత ప్రణయాధిదేవతకు పుణ్యక్షేత్రమే యయ్యె నీ
చేతోవీథి ; పరార్థచింత నుపదేశించున్ భవద్వృత్తి ; ప్ర
ఖ్యాతం బైనది నీ ప్రవృత్తి ; ఇవిగో నమ్మా ! నమోవాకముల్ !!

# పోచిరాజు శేషగిరిరావు

## అంతర్లీల

వెన్నెల చూతునో! విధుర వీణల గీతిక లాలపింతునో!
స్విన్న హృదంతరమ్ము గల స్నేహితు లెందరొ లేకనా? ప్రభా
భ్యున్నతికై తపించు ఋషులున్న దినమ్ములు రాకనా? ఇకే
మున్నను నేమి పుష్టి! మనసున్న మనస్వి యొకండు లేనిచో!

తెరచిన పుస్తకమ్ము, గురుతింపగ లే మెవ డెట్లు మూయునో!
పరమొ! గిరమ్మొ! దాని తలపై నొక గుప్పెడు మట్టివోసి. సం
బరపడు చుందు రైహికము పైకొని- భోగములందు తేలి- యీ
విరతియె లేని జీవితము వెక్కప పాటును గూర్పదా ప్రభూ!

తలుపులు తీసినంత పరతత్త్వము కాంతులు లోవ దూరి హృ
న్నిలయము కాంతి ధామమయి నెక్కొను, నీ కరుణాకటాక్ష రో
చులు తనువెల్ల సోకి నునుసోయగముల్ హవణించు, జీవనా
డులు గురుశక్తివాహిక లెటో! కదలాడును, సొక్కి సోలుదున్

లలిత రాగాను లాప వాల్లభ్య మబ్బి
ఉబ్బి తబ్బిబ్బు నగుచుందు నొక్క వేళ;
కోర కుండగ నెదుటనె కూరుచుండి
దర్శన మ్మిత్తు వేమి? సుధామయాత్మ!

దారి దివ్వెగ నీవె ముందుండి నడువ
అడుగులో నడుగు వైచుచు నడచు కొనుచు
తన్మయతనుండ, నీవెటొ తలగిపోదు
న్యాయమా యిది నీకు? ప్రజ్ఞానుమేయ!

లోని చూపున, నీ దైన లోతు లరయ
తపన చెందెడు వారి యాతనలు గవియు

జాలిపడవేమి స్వామి ! నిష్కామ గతులు
కల్ప తరువుల నీడలు కావా ! దేవ !

ఎన్ని యత్నమ్ము లేని ఫలింప కుండ
కట్టడి యొనర్చి నావె యకారణముగ ?
కాంతి రజమును రాల్చిన కలుగబోదు
నీ ప్రభకు లోటు ! కారుణ్యనిధి వటోయి !

* * *

"కవిని గన్న తల్లి గర్భంబు ధన్యంబు
కృతిని జెందువాడు మృతుడుగాడు
పెరుగు దోటకూర విఖ్యాత పురుషులు
కవిని వ్యర్థ జీవిగా దలంత్రు.
తమ్మి చూలి కేలు దమ్మిని గల నేర్పు
కవి కలంబునందు గలదు గాన
నీశ్వరత్వ మతనికే చతామణియయ్యె ;
నిక్కువమ్ముగ బూజనీయు డతడు.
క్షణము గడచిన దాని వెన్కకు మఱల్ప
సాధ్యమే మానవున కిలా చక్రమందు ?
దాటి పోయిన యుగముల నాటి చరిత
మరల బుట్టింప గవియె సమర్థుడగును" —జాషువ

# బాలగంగాధర తిలక్

## విషణ్ణ వైదేహి

ఆ మున్యాశ్రమ వాటికా మధుర కుల్యాజీవనోజ్జీవన
శ్రీ మందారమహీజ మూలమున ఓ సీతమ్మ, ఆసీనవై
ఏ మాలోచనలా దృగంచలములం దేవార్ద్ర మేఘావళీ
శ్యామాకాశము లోసరిల్లినవొ ఆశాహీన కాళచ్ఛవిన్.

ఏదో శూన్యము హృద్గతంబయిన భాతిన్ దోచు నెమ్మోము బా
ధాదైన్యమ్మున కొక్క దర్పణము కాదా తల్లి! రాజ్ఞీత్వ మ
ర్యాదాలంకృతయైన రాఘవుని యిల్లాలిట్లు చింతాజ్వల
న్నైన దాఘాగ్నుల గాత్రవల్లి వసివాళ్వాడించునే నిర్దయన్.

అల్లిన నారచీర బిరుసై సుకుమార వపుర్ని పీడనా
వేల్లనమైన లెక్కగొన; వించుకదోహదమేని లేని నీ
నల్లని కైశికమ్ము జఘనమ్మునఁ బర్వె సుదీర్ఘ దుఃఖమే
వెల్లువయైనయట్లు రఘువీరుడు మోపిన నిందయట్లుగా.

నిన్ను స్వయంవరారచిత నిస్తులమూర్తిని, పూర్ణచంద్రికా
స్విన్న విలాసగాత్రరస సేవధిగాంచి. హఠాదధిజ్య బా
ణోన్నత కోటిమన్మథు లెదుర్కొన నెంత చలించినాడు శ్రీ
మన్నలినాక్షు డంబ! పవమాన విధూత వినీల మేఘమై.

ఊరుపు నూరు పేర్పరుప నొల్లని మీ ప్రణయైక జీవన
ప్రేరితమై ద్విధాహృదయ భేదమెరుంగని స్పందన క్రియా
కోరకితమ్మునై అవధి గొన్నది కాలము పుండరీక మా
లారమణీయమై విరిసెనందురు కాదటె మీగళమ్ములన్.

ఏ విధిచేత నీవిటుల నేచు వియోగపు సీతు కందువన్
పూవయి వాడివత్తలయి పోతివొ; అల్ల రఘూద్వహుండు సీ

తావిరహార్చిలో తనకుదానె సమిత్తుగ మౌనవేదనా
జీవము వేల్చు, భీకరము చిత్రము వక్రము జీవితాధ్వమున్.

నీ కథ నన్ను నవ్య నవనీతమువోలె కరంచె, భారతా
స్త్రీకచరిత్రలో విషమసుందరమున్ కరుణా ప్రఫుల్లమున్
ప్రేకదనమ్ము దుస్సహపు వేదనయుర్మి మిళితమ్ము నొంది. ఏ
కైక విషాదనాయికవుగా జగదీడితవైతి వమ్మరో.

పాండవపత్ని జీవితపుబాట యగమ్యము నిత్యయాతనా
చండిమమున్ ; తదన్యగుణశాలిను లున్నను, తల్లి నీవు మా
గుండెల రక్తనాళముల కోసిన జాలివి, నిర్మలత్వ మే
నిండుగ వెల్గు నీకనులు నిల్చును జాతికి వెల్గు మిన్నులై

అడుగులోన అడుగులై నడచెడి నిన్ను
నిడుము లొరసి ముంచె కడలివోలె ;
కడలులేని రేయి కటికి చీకటిలోన
మొగిలు కూడ క్రమ్మి మూసె నభము.
కాని గాఢదుఃఖ కర్దమహృదయాన
విరిసెనోహెూ ధ్యాన సరసిజమ్ము
రామనామ సూర్యరశ్మి సోకినయంత
దళము దళముపాడు గళము నెత్తి.
నీవు సన్నిహితవు నిఖిలాంధ్ర జాతికి
నీదు పేరు విన్న నిలిచి మ్రొక్కు
బాధనోర్చి బ్రతుకు పడతిని సీతమ్మ
యీామెయంచు పిలుతు రింటనింట

ఏ శరదిందు రేఖ స్పృశియింపగ నవ్విన సన్నజాజి, ఆ
శా సికతాతలాల చిరునవ్వడి దొర్లెడి పాలనుర్వు, ఏ
మూసిన కొండకోన కొస మ్రోగిన వేకువ వెల్గు మువ్వ, నీ
తో సరిరావుగా వికసితోత్పల నేత్రి ! మైథిలీ !

# అనువాద కవిత

స్పానిష్ కవిత (క్యూబా)

### గిల్లెన్

వాతనైతే తెలుగులో మాట్లాడి చూడమను !

జాత్యహంకారంతో
నిన్ను
శుద్ధ మొద్దావతారం అన్నాడు వాడు
విక్టర్ హ్యూగోకి ముద్దుల మనవడెవరో
నీకు తెలియనందుకే
గొంతు చించుకుని
నీ మీద అరిచేడు వాడు
బిస్మార్క్ ఎప్పుడు చచ్చిపోయేడో
సరిగ్గా నువ్వు చెప్పలేదని
విసురుగా బూటు కాలు జాడించేడు వాడు
పుట్‌లాగే బుట్ ఎందుకు కాలేదని
సందేహమొచ్చినందుకే
నీ మీద కోపాన్ని కుమ్మరించేడు వాడు
అయితే ఏం మునిగిందటా ?
ఇప్పుడు నీ వంతు వచ్చింది కానియ్ !
అనమను తొందరగా చూద్దాం
అబ్రకదబ్రా అనో
అనిపిండి జయప్రభా అనో
పోనీ
పుల్లేటికుర్రు ఎక్కడుందో గుర్తుపట్టి వెంటనే చెప్పమను
అదీ వాతకాలే ?
సరే, శంకరంబాడి సుందరాచార్య
పేరు విన్నాడేమో అడుగు

పొట్టి శ్రీరాములు పుట్టిందెక్కడో
అదైనా చెప్పలేడూ ?
అంతేనా ?
చాతనైతే వాడిని
తెలంగాణా తెలుగులో మాట్లాడి చూపించమను !

(స్వేచ్ఛానువాదం : జయప్రభ)

ఇంగ్లీషు కవిత

## కె. ఎల్. బ్రౌన్

### చిన్న మొక్క

నేల తవ్వి లోతుగా పాతేసిన గింజ గుండెలో
హాయిగా అన్నీ మరిచిపోయినట్టుగా అదే పనిగా
నిద్రపోతూ ఉంటుంది మనలాంటిదే ఒక చిన్న మొక్క

పొద్దున్నే మామూలుగా పైకి వచ్చే సూర్యుడు
ముందుగా నేలలోపలికి తన కిరణాల్ని పంపి
చేతితో తట్టిలేపినట్లు 'లేలే ఇంకా నిద్రేమిటి'
అంటూ ఆ మొక్కను గబగబా లేపుతాడు.

"పైకి రా పాకుతూ ఇంకా గింజలోనే
నిద్రపోతూంటే ఈ లోకం ఎప్పుడు చూస్తావు ?"
అంటాడు సూర్యుడు ! అంతలోనే నాలుగు వానచినుకులు
కూడా వచ్చి "నిజమే సూర్యుడు చెప్పాడుగా,
లే లే పైకి పాకుతూ వచ్చేయి ! బాగుంటుంది
ఈ లోకం చూద్దువుగాని" అంటాయి గోముగా.
ఆ చిన్న మొక్క ఈ మాటలు శ్రద్ధగా విని
నిద్రను చీదరించుకుంటూ ఉత్సాహంగా
పైకి పాకుతూ వస్తుంది "అసలు ఈలోకం
అంత అద్భుతంగా ఉంటుందా" అనుకుంటూ.

(అనువాదం : మిరియాల రామకృష్ణ)

కెనెడియన్ కవిత :

# ఇర్వింగ్ లేటన్

## చల్లని ఆకు పచ్చని తోటలో....

తోటలో నేను వాహ్యాళికి వెళ్ళొచ్చేదాకా
గాలీదాని ఉపగ్రహమూ నా కోసం
ఆ వివర నిరీక్షిస్తూంటాయి
వాటి నిరీక్షణకు కారణ మేమిటో
అక్కడికి వెళ్ళేదాకా నాకర్థం కాలేదు
ఆ నల్లటోపీ నిర్వాహకుడు కూడా
గడ్డిలో కొట్టు మిట్లాడుతున్న నా హృదయాన్ని చూస్తూ
అలా నన్ను దాటి పోతూ తనూ అక్కడికే వెళ్తున్నాడు
"హలో" అంటూ అతన్తో మాటకలిపే న్నేను :
సముద్రంలోంచి ఉవ్వెత్తున లేచిన తుఫానుగాలి
మరణించిన కవిగాణ్ణొకణ్ణి నీట్లోంచి లాగేసి
ఆకాశం మీది కెగరేసింది
అతడిప్పుడీ మహానగర
ద్వారాల్నించి వ్రేళ్ళాడుతున్నాడు
ప్రజలందరూ ఆ దృశ్యాన్ని చూట్టానికి తరలి వస్తున్నారు
చూశాక విషాదాన్ని పులుముకున్న ముఖాల్తో వెళిపోతున్నారు.
ఆ విగ్రహం కాళ్ళు గాల్లో ఎగురుతూంటే
ఆ కాళ్ళవద్ద కూర్చుని
వాళ్ళు నారింజకాయలు వొలుచుక తింటున్నారు.
అలా చెప్పి నేనిలా ప్రక్కకి తిరిగి
వొంగిన వీపుమీద లేలేత కొమ్మల్ని
కిరీటంలా ధరించి
తటిల్లతని సహితం భరించ లేనంత
సుకుమారంగా పెరిగిన
ఓ చెట్టు నడుం సున్నితంగా పట్టుకొని
ప్రియునిలా కౌగిలించుకున్నాను.

గాలి కెగిరిపోయాయి జబ్బులన్నీ
ఎగిరి పోయాయి మందు సీసాలపై
పేర్ల చీటీలన్నీ
ఈ మధ్యనే నేను చూస్తున్నా
ముదుసలి వనితల కళ్ళల్లో
నా ఉడిగి పోతున్న పురుషత్వానికి
విచారాన్ని వ్యక్తం చేస్తూ
ప్రవహిస్తున్న దుఃఖ సముద్రాల్ని-
ఆ అలసిన కళ్ళ బావిళ్ళలో
సూర్యుడు తామరాకు పై మాంసంముద్దలా
మారి పోయాడు
వ్రేలాడుతున్న పురాతన కొమ్మల్నించి
హత్యగావించ బడ్డ నా ఆత్మలు
పళ్ళగుత్తుల మధ్య మూగ తాకిళ్ళలా
గాలిని వెలిగించాయి.
ఒక కుక్క నా రక్తంలోంచి అరుస్తోంది
పసుప్పచ్చని కళ్ళతో ఆ నల్ల కుక్కే
ఎవరి ద్వారానో ఏమో అనుకోకుండానే
ఆ తామరాకు మీది రక్తపు ముద్దని చూసింది.
ఈ కోపతాపాలు కవిత్వప్పూరుగును
సమీపిస్తున్న నా దారిని సుగమం చేసాయి
రాబిన్ పక్షి గొంతులో కూర్చుని ఆ పురుగే
ఓ గంట సేపు పాటలు పాడింది.
యువకుల దొంగ ఏడ్పులకి
దారి కోల్పోయిన నేను
మళ్ళీ ఈ చల్లని ఆకుపచ్చని తోటలో
ఊపిరాడక ఈదుతూనే వున్నాను.

(స్వేచ్ఛానువాదం : సుమనశ్రీ)

కన్నడ కవిత :

# చంద్రశేఖర పాటీల

## నాలోని వారు

పోలీసులను చూచినపుడు
నాలోని దొంగ
దొంగ చూపు చూస్తాడు

దొంగలను చూచినపుడు
నాలోని పోలీసు
పోకిరి నవ్వులు వలకబోస్తాడు.

పోలీసు దొంగని
వెంబడించడం చూచినప్పుడు
నాలోని దొంగ
నాలోని పోలీసును
మక్కెలిరగ దంతాడు.

## ఏమైనావు ఏమైనావు

చెడు విననని
చెవులు మూసుకున్నావు
చెడు చూడనని
కళ్ళు మూసుకున్నావు
చెడు మాట్లాడనని
నోరు మూసుకున్నావు.
ఇవన్నీ మూసుకొని
ఏమైనావు ? ఏమైనావు ?
మహాత్ముని బల్లపైన కూర్చున్న
కోతివైనావు.

(అనువాదం : ఎస్. రఘునాథ)

# గోదావరి శర్మగారి స్పష్టీకరణలు

(నా సందేహాలకు కె. గోదావరి శర్మగారు వ్రాసిన 22-4-_8 తేదీ జవాబు లోని అంశాలు తోటి పాఠకులకు ఉపయోగిస్తాయని తలంచి సమర్పిస్తున్న
ఏలేశ్వరపు రామకృష్ణశాస్త్రి, వారణాసి)

1. సందేహం: స్వాగతగీతం కవిత. (చైతన్య కవిత-సంచిక 1)

దైవదర్శనమే దివ్యవరమని/దీక్షగా తపించే భక్తుడికి

తక్షణమే దేవుడు ప్రత్యక్షమై/ఇంకావరాలు కోరుకోమన్నట్లు.

ఇక్కడ 'దీక్షగా తపించుతున్న' క్వాలిఫికేషను భక్తుడికి విశేషించిన తరువాత, 'తక్షణమే' అన్నమాట పొసగటం లేదు.

సమాధానం :

దీక్షగా తపించడం అన్నదాంట్లో ఏకాగ్రత, తీక్ష్ణత ఉన్నాయిగాని అది సుదీర్ఘ తపస్సు కానక్కర లేదు. క్లుప్తమైనా ప్రయత్నాలకి సద్యోఫలితాలు కలగడం మనకథల్లో ఉన్నదే. మీకు శ్రీ శ్రీగారి 'చిరదీక్షా తపస్స మీక్షణలో' అన్న ప్రయోగం మనసులో ఉందేమో! ఇక్కడ తక్షణమే అన్న పదానికి జాగు చేసి పరీక్షించకుండా, తొందరగా అనిమాత్రమే అన్వయించు కోవలసిందని ప్రార్థన.

2. సందేహం : ఇంప్రెషనిష్టు సంధ్య కవిత. (చైతన్య కవిత-సంచిక 1)

అస్తమించే సూర్యుడు/వెండి మబ్బు మీసాల మీద

నిలబెట్టిన నిమ్మ పండ.

నేను చూచిన సంధ్యల్లో ఇంతవరకు సూర్యుడు అస్తమిస్తున్నపుడు మబ్బులకు వెండి తెలుపు, మీసాల నలుపు, సూర్యునిలో నిమ్మ పండు పచ్చన–వర్ణాలు కనిపించలేదు. ఈ ఇమేజ్ నప్పలేదు.

సమాధానం :

సూర్యోదయ సూర్యాస్తమయాలు రోజూ జరిగే అద్భుతాలు. ఆ సమయాల్లో ఆకాశంలో వ్యాపించిన మేఘ శకలాల రూపు రేఖలు, రంగులు చిత్ర విచిత్రాలుగా మారుతుంటాయి. ఒక పద్ధతి ప్రకారం కాక

unpredictable గా, అనూహ్యమైన విన్యాసాలతో మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. ఇవి రోజూ ఒకేలా ఉండవు. ఒక్కొక్క సాయంకాలపు వాతావరణం, కవి మనఃస్థితి, అతడి పరిసరాలు (land scape-geographical and mental)–వీటిని బట్టి వాస్తవానికి ఊహ, కల్పన కూడా తోడై మామూలుగా కంటికి కనిపించే దృశ్యమే కాక అందులో కొత్త అందం, కొత్త అర్థం దృశ్య మానమవుతాయి. ఆ రంగుల కలయిక. అది ఒక ప్రత్యేక భావాన్ని స్ఫురింప జెయ్యడం – ఈ విషయంలో మీరు కవికి కొంత poetic licence ఇవ్వాలి. ఇంప్రెషనిష్టు సంధ్య అది–నేచురలిష్టు సంధ్య కాదు. అంటే కవి సంధ్యా దృశ్యాన్ని యథా తథంగా చిత్రించడం లేదు. (ఎవరికైనా ఎలా కనిపిస్తుందో అలా కాదు.) కేవలం తన మీద ఆదృశ్యం ఎలాంటి impression కలిగించిందో దాని చిత్రణ ఆ పద్యం. ఈ subjective element ని మీరు గుర్తించాలని నా మనవి.

3. సందేహం : ఘనకార్యం కవిత (చైతన్య కవిత–సంచిక 2)
కవి చెప్పదలచినది అస్పష్టంగా ఉంది.
'పొరుగు పచ్చ/ఓర్వలేని/విషప్పురుగు/లోకటా రెండా ?'—ఈ లైన్ల context అతకటం లేదు.

'మనం మానవులం./ఆకలి, కామం మనధర్మాలు./అవిపాపం అనడం/వాడికి ధర్మం కాదు./'— వాడెవడు ? ఎందుకన్నాడు ?

'అందాలు సృష్టించినవాడు/అనుభవిస్తే వద్దంటాడా ?'— హద్దు మీరిన అనుభవమైతే సృష్టికర్తా వద్దంటాడు.

'అది దంపతులకి/మొదటిసారి/మగపిల్లడు పుడితే/వాడు హంతకుడు కావాలా ?'— హంతకుడవ్వాలనే దేవతలు బ్రహ్మ–చివరకు ఈశ్వరుడు, పార్వతి కోరి దాంపత్యం చేసిన ఘనకార్యమే కుమార సంభవం కదా ! 'అయినా పోనిద్దూ' అని సమాధానం చెప్పుకోవడం కవి చిత్తశుద్ధికి సవాలుగా ఉంది. ఘనకార్యం title ఇచ్చి ఉత్పత్తి ఘనకార్యం కాదని హేళన చేయదలిచారా ?

సమాధానం :

'ఘనకార్యం' నేను ఆశించిన భావాలని బట్వాడా చెయ్య లేకపోయినందుకు విచారిస్తున్నాను. అందులో నేను Chirstian, Hindu Myth

ని contrast చేసాను-creation విషయంలో (విశ్వసృష్టి-వ్యక్తి సృష్టి) మొదటి stanza లో వ్యాఖ్యానించినది Bible లోని genesis కథని. 'కొత్త కాపురం/పచ్చటి ప్యార్‌డైజ్'— అది ఆడం, ఈవ్‌ల కొత్తకాపురం Paradise లో प्यार ని గుర్తించి దానిని 'ప్యార్‌డైజ్' అని రాశాను నేను.

పొరుగు పచ్చ ఓర్వలేని విషప్పురుగు satan. దేవుడితో యుద్ధం చేసి నరకంలోకి తోయబడ్డ సైతాను. ఆ దేవుడి మీద పగ తీర్చుకొనే అవకాశం లేక, మట్టిలో పుట్టిన మానవులు దేవుడి ప్రేమకి పాత్రులవడం సహించలేక, వారిని నిషిద్ధ ఫలాన్ని తినమని ప్రోత్సాహిస్తాడు. ఈనాడు అలాంటి అసూయాగ్రస్తులెందరో! యౌవనంలో, కొత్త కాపురంలో ఉన్న వాళ్ళకి లోకమంతా అందంగా, ఆకర్షణీయంగా కనిపిస్తుంది (ఎర్రటి ఏపిల్). కాని అది నిషిద్ధ ఫలం. ఎటుచూసినా మనచేత పాపం చేయించడానికి సైతాను పన్నిన వలలే. ఆ ఆకర్షణలకి లోబడక ఎంతో నియమ నిష్ఠలతో జతకమని క్రైస్తవం చెవుతుంది. అయితే క్రైస్తవంలో మనకి మింగుడు పడని అంశం—యౌవనంలాంటి ఈడెన్ వనాన్ని సృష్టించి అందులో మనని పుట్టించి, ఆంక్షలెందుకు పెట్టాడు దేవుడు? ఆకలి, కామం మనకి అవసరాలు చేసి అవి తీర్చుకోవడం పాపం అంటాడేం? మనల్ని బలహీనులుగా పుట్టించి, ఆ బలహీనతకి మనని శిక్షించడం 'వాడికి' ధర్మమేనా? విజ్ఞాన ఫలం నిషిద్ధం ఎందుకు కావాలి? అలాంటి చెట్టు ఈడెన్ వనంలో ఎందుకుందీ ఏడం ఈవ్‌ల భోగ్య వస్తువు కాకపోతే? ఇలాంటి ప్రశ్నలకు క్రైస్తవంలో సమాధానం లేదు ఏమడిగినా 'సంశయాత్మా వినశ్యతి' అంటారు. నమ్మమంటారు. అంతే.

ఆది దంపతులకి (పార్వతీ పరమేశ్వరులకి కాదు, ఏడం ఈవ్‌లకి) కొడుకు పుడితే వాడు (Cain) తన తమ్ముణ్ణి (Able) హతమార్చి హంతకుడయ్యాడు. ఇదీ దేవుడి నిర్ణయమేనా, మనిషి ప్రారబ్ధమా? అసలు వ్యవహారమంతా చాలా unpleasant గా ఉంది. దానితో సరిపోల్చితే 'అయినా పోనిద్దూ?/మనపద్ధతే/బాగుందిలెద్దూ!' అనాలని పించదూ?

మన కుమారసంభవ కథ ఎంత అర్థవంతంగా, పకడ్ బందీగా, పవిత్రంగా ఉందో మీకు తెలుసుకదా? శృంగారం, దాంపత్యం, గర్భధారణ, కుమార(రీ) సంభవం- ఇవన్నీ మనకి ఆమోద యోగ్యాలే. ఏదీ

పాపం కాదు. పైగా మూడో పురుషార్థంగా ముక్తిమార్గం కూడాను. భగవంతుడి స్థాయికి ఎదగాలనుకోవడం క్రైస్తవులలో పాపం, Pride and Presumption. దానికివాళ్ళు శిక్షింపబడతారు. మనమతం పురుషుడిని పురుషోత్తముడు కమ్మని ప్రోత్సాహిస్తూంది. అదే ఆదర్శం, అదే గమ్యం అంటూంది. అసలు మనిషికీ దేవుడికీ తేడాయే లేదని, అద్వైతాన్ని గుర్తించక మాయలో ఉండడం వల్లనే ఈ ద్వంద్వాలన్నీ అంటూంది. చూశారా వాళ్ళకీ మనకీ ఎంత తేడా ఉందో? అంచేత పుత్రోత్సాహంలో తండ్రి ఘనకార్యమే చేశాననుకోవడంలో తప్పు లేదు కదా!

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : శ్రీ డి. కె. ఆదికేశవులు

ఉపాధ్యక్షులు : శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఎ.ఎస్.

కార్యదర్శులు : ఆచార్య తంగిరాల సుబ్బారావు
డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : శ్రీ పి. యు. బి. శర్మ

1990లో చేరిన సభ్యులు (9వ సంచిక తరువాయి)
పోషక సభ్యులు

శ్రీయుతులు

6. వీరమ్మ, జి. పాపయ్య దంపతులు, యాదయ్య నెల్లూరు, ధర్మపురి జిల్లా, తమిళ నాడు.
7. కె. వి. శేఖరరాజు, మేనేజింగ్ డైరక్టరు, రాయలసీమ సిమెంటు ప్రోడక్ట్స (ప్రై) లిమిటెడ్, బెంగుళూరు-9.
8 డా. పప్పు వేణుగోపాలరావు, మద్రాసు.
9. పి. జె. రెడ్డి, జనరల్ మేనేజర్, టి. టి. ప్రైవేటు లిమిటెడ్, బెంగుళూరు–16
10. శతావధాని శ్రీ కడిమెళ్ల వరప్రసాదరావు, నరసాపురం, ప.గో. జిల్లా.
11. కీ. శే. చన్నాప్రగడ లక్ష్మీనారాయణ (తెనాలి)గారి జ్ఞాపకార్థం వారి తమ్ముని కుమార్తె డా. చన్నాప్రగడ జయలక్ష్మి, బెంగుళూరు-56
12. చి॥ శిల్ప, చి॥ భావన (ఆచార్య తంగిరాల సుబ్బారావుగారి మనుమరాండ్రు), హైదరాబాదు–32

## జీవిత సభ్యులు

శ్రీయుతులు

19. డా. జి. త్రివిక్రమ రావు, వారణాసి
20. దర్భశయనం శ్రీనివాసాచార్య, వరంగల్
21. జి. సత్యానంద రెడ్డి, అగ్గొండపల్లి, హొసూరు తాలూకా, ధర్మపురి జిల్లా, తమిళనాడు
22. మొగలి రామస్వామి రెడ్డి, హొసూరు
23. ఎన్. ఎస్. శారదాప్రసాద్, మైసూరు
24. ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు, అనంతపురం
25. కె. జగ్గయ్య (సినీ నటుడు), మద్రాసు-40
26. ఎ. కె. జయచంద్రారెడ్డి, బెంగుళూరు-4
27. ఫణికుమార్, హైదరాబాదు
28. డా. సి. రమణయ్య, రాజమండ్రి
29. డా. పోన్నా లీలావతమ్మ, రాజమండ్రి
30. గుత్తా రాధాకృష్ణమూర్తి, మల్లవల్లి, కృష్ణా జిల్లా
31. ద్వా. నా. శాస్త్రి, అమలాపురం
32. ఆచార్య ఎస్. వి. రామారావు, హైదరాబాదు
33. సి. హెచ్. మారుతీ శ్రీలత, బెంగుళూరు
34. మోచర్ల రాజారాం, అడ్వొకేట్, నరసాపురం
35. ఆచార్య ఎం. వి. శాస్త్రి, హైదరాబాదు
36. ఆచార్య క. వ. న. శర్మ, బెంగుళూరు
37. ఎం. అబ్బేశ్వరరావు, గుంటూరు
38. లైబ్రేరియన్, శ్రీ గౌతమీ రీజినల్ లైబ్రరీ, రాజమండ్రి
39. లైబ్రేరియన్, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు
40. లైబ్రేరియన్, ఎస్. కె. విశ్వవిద్యాలయం, అనంతపురం
41. లైబ్రేరియన్, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి
42. కె. కె. వి. శర్మ, హైదరాబాదు

43. డా. వాగంటి తులసి, బరంపురం

44. ఎ. ఎస్. లక్ష్మి, ఐ. పి. యస్., అసిస్టెంట్ అకౌంటెంట్ జనరల్, హైదరాబాదు-4

## ప్రత్యేక సభ్యులు

శ్రీయుతులు

8. యస్. మునిసుందరం, తిరుపతి
9. వంకా సత్యనారాయణ, మాజీ ఎం.ఎల్.ఎ., తణుకు
10. ఉత్పల సత్యనారాయణాచార్య, హైదరాబాదు-35
11. కె. రాజు, పుంగనూరు
12. డా. సుమతీ నరేంద్ర, హైదరాబాదు
13. డా. హెచ్. ఎస్. సుజాత, మైసూరు
14. నాగభైరవ కోటేశ్వరరావు, చీరాల
15. ఇ. రఘునాథరెడ్డి, చిత్తూరు
16. డా. ఎస్. వెంకమాంబ, బళ్ళారి

10

ప్రమోద శరత్తు

AUTUMN 1990



# చైతన్యకవిత



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు